Registered No. M-4345

# యుద్ధ సంచిక.

వాల్యుం II.] 1942 వ సం॥ మే నెల 1 వ తేది శుక్రవారం [నె 17 ర.

## మదరాసు గవర్నరు సందేశం.

"వీలయినంత నెమ్మదిగా ఆందోళన చెందకుండా ఉండండి ; వదంతులను నమ్మకండి, చేతనైనవిధంగా అధికారులకు సహాయం చేయండి. ఈరీతిగా మనలో ప్రతివారు తమ విధిని నెరవేర్చి మనమందరం హృదయపూర్వకంగా అభిలషించుచున్న విజయం చేకూర్చుటకు తోడ్పడగలం."

అని మదరాసు గవర్నరు సర్ ఆర్థరు హోపుగారు ఏప్రిల్ 27 వ తేదీన మదరాసు రేడియోద్వారా రాష్ట్రవాసులను హెచ్చరించిరి :—"ఏప్రిలు 11 వ తేదీన మదరాసు ప్రభుత్వంవారు ప్రకటించిననాడు, మదరాసు నగరానికి, మదరాసు సముద్రతీరానికి దండయాత్ర బెదురు వెంటనే యున్నట్లు నమ్ముటకు ప్రబల కారణములుండెను. అదృష్టవశాస్తు ఆ బెదురు తప్పిపోయింది. సేనాధిపతిగారు చెప్పినట్లు, జపానువారు బంగాళాఖాతము హిందూమహాసముద్రములనుండి తరిమివేయబడువరకు శత్రుని దండయాత్ర అవకాశం వుండనే యుండును. మనకు క్రొత్తగ సహాయం వచ్చి పడుతున్నకొలది వారంవారానికి యీ ప్రమాదం తగ్గిపోగలదు. విశాఖపట్నం, కాకినాడలలో జరిగినటువంటి విమానదాడులకు ఎపుడూ అవకాశముంది. మనమందుకు తయారుగానుండాలి. అయితే జర్మనీపై బ్రిటిషు విమానాలు చేస్తున్నంత తీవ్రదాడి యిక్కడ జరుగనేరదు. విమానాల బరువుమోసేశక్తి దూరం కూడా గమనించాలి. కావున నిజంగా తీవ్రమగు దాడులకన్న చికాకుచేసేదాడి జరిగే అవకాశాలు ఎక్కువ గలవు.

"సివిలు ప్రజలు ఏంచేయాలంటే ! నేను యిదివరకూ చెప్పేను, యిపుడూ చెపుతున్నాను ; సముద్రతీర ప్రాంతాలందు పని లేక, తమకుగాని మిత్రులకుగాని యిబ్బంది లేకుండా దూరపు జిల్లాలలో నివశింపగలవారు అట్లు చేయవలెను ; కాని యింకోచోట జరుగనిపని యీ తీరప్రాంతాలందే యున్నవారు, ఆ పనిలోనే యుండాలి ; వెళ్లిపోయియుంటే తిరిగి రావాలి. ఎప్పుడును, ప్రమాదం వుంటే హెచ్చరిక వీలయినంత ముందుగ తెలుపబడును. జిల్లాలలో ప్రమాదం తక్కువ, కొండ ప్రదేశాలలో లెక్కజేయదగిన ప్రమాదంవుండదు. ఊరునుండి ఊరికి ఊరకతిరగ నవసరం లేదు. రోజులు గడచినకొలది మన బలం అధికమగుచున్నది. శత్రువు నౌకలపై వచ్చినా విమానాలపై వచ్చినా నిరోధించడానికి చేయవలసిన పనులు జరిగినవి, జరుగుచున్నవి.

"ఇది చాల క్లిష్టసమయం. కాని ప్రజలు వెనకటి బిన్నత్వాలు మరచి, ధైర్యం చెడక సద్ప్రవర్తనతో, దేశరక్షణకై అద్భుతంగా పోరాడుచున్నవారికి అందరుకలసి సహాయంచేసినచో యీ కష్టాలు పోతాయి. ముందుస్థితి తలుచుకుంటే ఒకపుడు అగాధం వలె కనబడవచ్చు, వదంతులు నిరాశ ప్రజల మనోధైర్యం చెడగొట్టవచ్చును. కాని మనం చూడవలసింది చిట్టచివర విజయం. అది మనకు చేకూరుననుటకు సందేహము లేదు.

సంయుక్త రాజ్యాల విశేష శక్తిసంపదల వలన మనకు విజయంతథ్యం. ప్రతివారు మామూలుగ తమ పనులు చేసుకొనుటకు స్థిరసంకల్పులై జపాన్ను ఎదుర్కొన్నచో విజయం మనదే, తప్పదు. జపాను జర్మనీలు పూర్తిగ ఓడిపోవాలనియే మదరాసు ప్రజలం దత్యధికభాగం కోరుచున్నారని నేను నమ్ముచున్నాను. అందుకు వారు చేయవలసిందంతా చేస్తారని నమ్ముచున్నాను."



# యుద్ధ విమర్శ.

## జర్మనీలో యుద్ధమంటే విసుగు—చలికాలం విశ్రాంతి లేదు— సైనికులు చాలకుండుట.

జర్మనీ ప్రచురణ శాఖమంత్రియైన డా॥ గోయిబెల్సుగారు విజయమార్గం ఎన్నిసారులో దాటివచ్చిరి. ఈసారి జర్మను ప్రజలు వారి మాటలు నమ్ముటలేదు. వారి సేనలు ఎన్నో విజయాలు పొందినవని గోయిబెల్సుగారు చెప్పడమేగాని యుద్ధ విజయం యింకా కనబడదు. అందుచే వారు విసుగు చెందియున్నారు. గోయిబెల్సు గత రెండేండ్లలో చెప్పిన ప్రగల్భాలు యిపుడు చెప్పలేకున్నాడు. రష్యా రంగంలో యుద్ధం తగ్గుటకు బదులు హెచ్చుతున్నది. జర్మనీలో ప్రతి కుటుంబంలో ఒకడు సైన్యంలో చేరియున్నాడు. జీవనం కష్టంగానుంది. ఆ విషయం గోయిబెల్సుగారే డాసురీచ్ అను పత్రికలో అంగీకరించిరి. వారిట్లు వ్రాసిరి :—

"యుద్ధంలో కష్టనష్టాలు పొందుతూ లేదనుకోడం మా వుద్దేశం కాదు. యుద్ధం ఎపుడూ విషాదమయినదే, ఘోరమయిందే . . . ఒకప్పుడు బొగ్గుండదు, ఒకప్పుడు ఉర్లగడ్డలుండవు . . సినిమా టిక్కట్ల కొరకు గంటల కొలది నించోవాలి."

జర్మనీలో సైనిక సంఖ్య, ఉత్పత్తి చిక్కులు చాల గలవు. ఈ విషయాలు బ్రిటిషు రేడియోలో యిట్లు తెలుపబడెను :—

మనుష్యుల కొరకు వెదుకుట.

ఈ శీతకాలంలోనే జర్మనీలో సైన్యం చాలదనే కష్టం తెలిసివచ్చింది, ఎందుకంటే ప్రతియేడు చలికాలంలోను జర్మనీ యుద్ధం నిలిపి, గోయిబెల్సుగారు తెలిపినట్లు "తయారునై విశ్రాంతి" గైకొనుచుండెను. ఈ యేడు స్టాలిను (రష్యా నియంత) ఆ విశ్రాంతిలేకుండా చేసేడు. సైనికులను తిరిగి పొలాలలోనికి ఫాక్టరీలలోనికి పంపుటకు బదులు హిట్లరు పొలాలనుండి ఫాక్టరీలనుండే మనుష్యులను తెచ్చి తూర్పు రంగంలో సైన్యంలో కలిగిన లోటును భర్తీచేయవలసి వచ్చింది. ఈ చలికాలంలో విశ్రాంతి గైకొని మందు గుండు ఆయుధాలు భర్తీ చేసుకోవలసిన 38 డివిజనుల జర్మను సేన యుద్ధ రంగంలోనే నిలచిపోవలసి వచ్చెను. ఫాక్టరీలలో శలవులు యివ్వడంలేదు. కచేరీలలో గుమాస్తాలను తగ్గించి 56 సంవత్సరముల వృద్ధులనుగూడ సైన్యంలో గుమాస్తాగిరీకి పంపుచున్నారట. 200,000 స్కూలు పిల్లలను చదువు ముగియకముందే టాంకులు విమానాల ఫాక్టరీలలో పనులకు పంపిరి. సైన్యం చాలక సేనానాయకులను, బాధ్యతగల ఉద్యోగులను హిట్లరు మార్చివేసెను. హిట్లరు యిపుడు భయపెట్టి, నిర్బంధించిగాని సైనికులను ఉద్యోగులను సంపాదించలేకుండా వున్నాడు.

జర్మను ప్రజలు ఎన్నికష్టాలో పడుచున్నారు. ఆహార పదార్థముల సప్లయి

యుద్ధం బడలిక.

ప్రజలకు ¼ వంతు తగ్గించబడు సని ఏప్రిలు 6 వ తేదిన ప్రకటించుట వారి కాశ్చర్యం కలిగించింది. గత యుద్ధంలోవలె యీసారి భోజనం తగ్గించుకోవలసిన అవసర ముండదని అధికారులు చెప్పియుండిరి. జర్మను లకు యిపుడు 1917 లో కంటే తక్కువ భోజన పదార్థములు యివ్వబడుచున్నవి. అయినా జర్మ నుల పట్టుదల ఏమీ తగ్గలేదు. అందుకు వారు ఎంతకాలంనుండో తరిఫీదు చేయబడిరి. కాని యుద్ధం బడలిక వారందరిలో కనబడుచున్నది. ప్రతివాడి నరాలు సడలేయి. చిర్రు బుస్సులు ఎక్కువైనాయి. జర్మను ప్రజలు మర్యాదతప్పి ప్రవర్తించుచున్నారని గోయిబెల్సుగారును, జర్మ ను పత్రికలును పలుసారులు మందలించియు న్నారు. "మనలో పలువురు చాల యెక్కువ పనిచేసి చికాకుగా నుండవచ్చును. ఆ విషయం మేము గుర్తించకపోలేదు, కాని అంతమాత్ర మున ఎవ్వరుగూడ ఉదయంనుండి రాత్రి వరకు తన చికాకు కనపరుస్తునే విసుక్కుంటూ యుండ రాదు."

ఇందువలన జర్మను ప్రజల ధైర్యం చెడిం దనుకోరాదు. కాని ప్రజ లెంత అదుర్దపడు చున్నారో అసౌఖ్యాలకు లోనయినదో వారెట్ల భావించుచున్నారో తెలియగలదు.

హిట్లరు యిటీవల ఉపన్యాసంలో యింకో

డా॥ బేన్సుగారి అభిప్రాయం.

విధమగు ఆందోళన కనబడు చున్నది. జకోస్లావోకియా ప్రభుత్వాధ్యక్షుడు డా॥ బేన్సు గారు హిట్లరు ఉపన్యాసంగూర్చి యిట్లన్నారు :—

"రష్యా యుద్ధం యింకో చలికాలంవరకు జర్మనులు చేయజాలరని హిట్లరుకి తెలుసు. జర్మనీలో గుట్టు కొంతవరకు మాబోటివారికి తెలుసు. మేముకూడ ఊహించలేనంత ఉప ద్రవం జర్మను దేశీయ వ్యవహారములం దున్న దని హిట్లరు ఆదివారంనాడు గావించిన ఉపన్యా సంలో అంగీకరించినట్లే నేను ఎంచుచున్నా ను. నాజీ సైన్యాలు ఓడిన తక్షణం దేశంలో నానా అరాచకం జరుగునని అతడు భయపడు చున్నాడు. హిట్లరు ఉపన్యాసం చాల బీదరుపుగ నుందని జర్మని సైనికోన్నతాధికారులకు తెలు సును. కావున వారు త్వరలో సంధికి ప్రయ త్నించెదరని అత డనుకొనెను. అట్టి యేర్పా టులు జరిగేయో లేదో స్పష్టంగా తెలియదు కాని జర్మనీలో అంతా సలీసుగాలేదనియు వసంతో ద్భవం అయినా వసంత దాడి ప్రారంభంకాలేదని స్పష్టంగా తెలుసు."

---

# హిట్లరు బీదరుపులు.

## ప్రగల్భాలు పోయినాయి· ఇపుడు గెలవకుంటే జర్మనీ నాశనమేనట·

గత ఆదివారంనాడు జర్మనీ శాసనసభయగు

హిట్లరు మాటల్లు.

రీచిస్టాగ్‌లో హిట్లరు ఉప న్యాసం వింతగావుంది. ఈ ఉపన్యాసంలో అతడు రష్యారంగంలో ఓడినట్లం గీకరించుటేగాక, జర్మనీలోనే ఏదో గొప్పలోప మున్నట్లంగీకరించెను.

అదివరకతని ఉపన్యాసాలలోనుండే ప్రగ ల్భాలు, భీకరమైనమాటలు పోయినాయి. తనలో ను, తన సైన్యంలోను, తన ప్రజలలోను యిది వరకుండిన విశ్వాసం అంతాపోయింది. కొం చెం దిగులు, రానున్న కష్టాలకు బాధ్యత యితరు లపై కొంత పంచాలను అభిలాష యీ మాటల్లో అగుపడుచున్నది.

రష్యాపై జర్మనీ దాడి విఫలమగుటగూర్చి తెల్పుచు, అచటి చలి మంచు జర్మను టాంకు లకు, వాహనాలకు నిరోధం కలిగించిందని చెప్పెను. "అందుచే యితరత్ర మనల నావ రించుకొనియున్న విధిని తప్పించుకోడానికి నేను పట్టుదలతో ప్రయత్నించుచున్నాను" అని అత డనెను. రష్యాపై వసంత ఋతువు దాడిగూర్చి ఎంతో చెప్పబడింది. అది యిప్పటికి వాయిదా పడ్డట్లే. ఏమంటే వచ్చేయేడు చలికాలం గురించి

# జర్మను విమానంపై "వి" గుర్తు



లిబియాలో టొబ్రుకునందు బ్రిటిషు సైన్యంలోని ఆస్ట్రేలియా సిపాయి పడగొట్టబడిన జర్మను విమానంపై విజయానికి "వి" గుర్తు వ్రాస్తున్నాడు. ఇట్టి విమానాలను ఎన్నోవందలు వీరు పడగొట్టేరు.

---

హిట్లరు మాట్లాడుచున్నాడు. వచ్చే చలికాలానికి జర్మనీ యిప్పటికన్న ఎక్కువ తయారుగా నుండ గలదనెను. "రష్యా చితికిపోయేవరకు తూర్పున యుద్ధం సాగుతూనేవుంటుంది. ఏటేట జర్మనీ జలాంతర్గాములు, ఆయుధాలు పెరిగిపోవుట ఇంగ్లాండు చూడగలదు" అని హిట్లరనెను. ఈ సారి రష్యాను చితగ్గొట్టుటకు యిదివరకువలె కాలనిర్ణయం సూచించలేదు, గమనించండి. ఏటేట ఆయుధాలు వృద్ధి చెందగలవని సూచించడంలో త్వరలో విజయం వస్తుందని అతడు ఆశిస్తున్నట్లు లేదు. అతననుకున్న విజయం మరి మరీ వెనక్కుపోతున్నది.

ఇపుడు జర్మనీ ఓడితే దేశంపూర్తిగ నాశనమైనట్లే యని అతనన్న మాటలు, జయించిన రాష్ట్రపతి జయించేమనుకుంటున్న తన ప్రజలకు చెప్పునట్టివిగా లేవు; ఆత్మరక్షణ చేసుకుంటున్న నాయకుని మొఱ్ఱగ వినుపిస్తున్నాయని అమెరికాలోని న్యూయార్కుటైమ్సు పత్రిక వ్రాసెను. హిట్లరు బెదరుపులవలన మిత్రమండలివారు భ్రమించి అశ్రద్ధగనుండరు. జర్మను సైన్యం నేడు నీరసంగావున్నా, యిదివరకు కన్న బలవంతంగావున్నా, సంయుక్త రాజ్యాలు శక్తికొలది వాటినికొట్టి అణచివేయాల్సిందే.

* * *

జర్మనీలో అవిధేయత.

అట్లా జరుగుతుందని హిట్లరు తయారుగానే వున్నాడు. అందుకు తగిన సన్నాహాలు జర్మనీలోను ఆక్రమిత దేశాలలోను చేస్తూనే యున్నాడు. అయితే స్వదేశంలో కొంచెం అపోహాలు యెక్కువై అవిధేయత పెరుగుచున్నట్లుంది. ముందది సర్దుబాటు చేయదలచెను. అందుకొరకే తాను అసాధారణాధికారాలను శాసన సభనుండి గైకొన్నాడు.

"మనదేశం చావు బ్రతుకులు సందేహంలో నున్న యీ విపరీత పరిస్థితులలో నాయిచ్ఛవచ్చినట్లు చేయుటకు దేశం నాకు సర్వాధికారం యిస్తుందనుకుంటున్నాను" అని అతడన్నాడు.

ఎవరివిధులు వారు నిర్వర్తించేటట్లు చేయడానికి, నిర్వర్తించనివారు ఎవరైనాసరే వారిని హెచ్చరించుటో పనిలోనుండి తీసివేయుటో చేయడానికి తనకు సర్వాధికారం యిమ్మని రీచిస్టాగును అతడు కోరెను. ఆ సభ ఆ అధికారాలు అతని

కిచ్చింది. సివిలు సర్వీసు ఉద్యోగులను, సేనా నాయకులను యిటీవల అతడు తానే దండించు చుండెను. తన పార్టీని యింకా బలపరచుకొనుటకు తానిదివరకు విధించిన శిక్షలకు శాసన సభాధికారమును యిపుడు హిట్లరు పొందెను. దేశంలో అవిధేయవర్గాలు ఎక్కువగు చున్నాయని హిట్లరు, అతని పార్టీయు బెంగపడుచున్నారనుటకు యిదే నిదర్శనము. మొత్తంపై అవిధేయత హెచ్చియుండాలి, లేదా తాను స్వయంగా శిక్షించడానికి వీలులేని ఉన్నతాధికారులు ఉద్యోగులెవరో ఎదురుతిరిగుండాలి. అట్టివారిని శాసన సభాధికారంలేకుండా కఠిన శిక్షలకు గురిచేస్తే ప్రజాందోళన అనుమానం ఎక్కువగును. అందుచే హిట్లరు యీ అధికారం కోరియుండును.

కావున ఏదో పెద్ద ఆందోళనతో హిట్లరు మూడో వసంతఋతు దాడి ప్రారంభించుచున్నాడు. 1940, 1941 సం॥ల వసంత దాడులు విజయ డంకాలతో ప్రారంభమయినవి. ఇపుడో? ఆడంకాలు నిశ్శబ్దంగా వున్నాయి. అపుడు మెరుపు పాటులో విజయాలు పొందుతామని భీకరాలు పలికేడు. ఇపుడు జరుపనున్న చర్యలు యత్నాలు చర్చించుటమాత్రం జరుగుచున్నది.

* * *

---

# బస్తీకి స్వస్తి.

కొంతమంది గుర్రపు సవారీ చేసేటప్పుడు బాగా పరిశీలించి చూడండి. గుర్రం పరుగు తక్కువైనా, గుర్రముమీద కూర్చున్న రౌతు ఎగురుతూ ఉండడం ఎక్కువగా ఉంటుంది గుర్రం పరుగు రవ్వంత, రౌతు ఎగరడం కొండంత అన్నట్లుగా ఉంటుంది. కొందరు వ్రాసేటప్పుడు వ్రాతకన్నా కలము ఎక్కువ మెలికలు తిరుగుతూ ఉంటుంది. కొందరు పాటకచ్చేరీ చేసేటప్పుడు స్వరముల విసురుకన్నా, తల విసరడం ఎక్కువగా ఉంటుంది. బడాయిగా మాట్లాడేవాడు లడాయికి నిలవలేడు బస్తీలలో ఉన్నంత బడాయి, పల్లెటూళ్లలో ఉండేవాళ్లకు ఉండదు ఉద్యోగములకోసం, నౌకరీలకోసం, అధికార పదవులకోసం, కోర్టు వ్యవహారాలకోసం, స్కూళ్ల చదువులకోసం, డాక్టరుల వైద్యంకోసం, రవాణా వ్యాపారముకోసం బస్తీలకు చేరుతారు జనం. కాని, బస్తీలలో రూపాయల పంటలేగాని, ధాన్యముల పంటలు లేవు. ఎన్ని కబుర్లు చెప్పినా, ఎన్ని చదువులు చదివినా, కడుపునిండే మార్గం చూడాలి అందుకనే గ్రామాలలో ఉంది గ్రాసం మనకు. ఎన్ని సంగ్రామాలు వచ్చినా, గ్రామాలు మాత్రం స్థిరమైన సాలగ్రామాలు అందాకా ఎందుకు? బాంబులు పడతాయనే భయం బస్తీలకు ఉన్నంతగా పల్లెటూళ్లకు లేనేలేదు అందుకనే బస్తీలలో ఉండే వాళ్లూ, కోస్తారేవు పట్టణాలలో ఉండేవాళ్లు, యిరుగుపొరుగు పల్లెటూళ్లకు చేరుతున్నారు. నిజం ఆలోచిస్తే, మనం చేరవలసినదే అక్కడికి. మన అయిశ్వర్యమంతా మన పల్లెలలే. మన పాడి, మన పంట అంతా అక్కడే ఉంది మనదేశపు ఖజానాఉన్న అసలైన కోటలే అవి ద్వారకానగరంలోలేని ఆనందం రేపల్లెవాడలోనే ఉంది. ఆధర్మసూక్ష్మం గ్రహించాలి. అక్కడ దర్శన మివ్వని ప్రభువు, ఇక్కడ సులభంగా దర్శనమిస్తాడు మన దేశంలో ప్రభువులకు బస్తీ కాపురం కాకుండా గ్రామవాసంకూడా ఉండేది. ఇంగ్లండులో జార్జి చక్రవర్తిగారుకూడా గ్రామవాసానికి తరచు వెళ్లివస్తూ ఉంటారు. బ్రిటిష్ ప్రధాన మంత్రికూడా మధ్యమధ్య గ్రామవాసంలో విశ్రాంతిగా కాలక్షేపం చేస్తూవుంటాడు అమెరికా ప్రెసిడెంటయిన రూజువెల్టుగారుకూడా పల్లెటూరుకువెళ్లి మకాముచేసివస్తూవుంటారు

ఇంతకూ చెప్పవచ్చినదేమిటంటే, మన దేశంలో బస్తీలలో అలవాటుపడిన పెద్దపెద్ద ఉద్యోగస్థులూ, అయిశ్వర్యవంతులూ, విద్యావంతులూ, కోస్తాలోని బస్తీలు విడిచి పల్లెలకు పోయి, అక్కడ కాపురంగా వుండడం అలవాటు చేసుకోలేదు. అంతేకాదు, వాటిమీద అసహ్యంకూడా అలవాటు చేసుకొన్నారు పల్లెలంటే చిల్లిగవ్వలతో సమానంగా చూడడం అభ్యాసమైంది కాని, అదంతా కాలమాహాత్మ్యమే గాని, వారి ననవలసిన పనిలేదు ఎల్లకాలం ఒక్కతీరుగా వుంటుందా కాలం? పల్లెటూళ్లకు మళ్లీ మంచి దశ వస్తోంది. మన గ్రామాలమీద మనకు గాలి తిరుగుతోంది. బస్తీలలో శత్రువిమానదాడి జరుగుతుందనే కారణంచేతనైనా స్వగ్రామాలకు చాలామంది చేరుతున్నారు అందువల్లనైనా స్వగ్రామాలమీద అభిమానం కలుగుతోంది శత్రువిమానం నాశనం కావలసినటువంటిది మన అభిమానం వృద్ధి కావలసినటువంటిది దీనినే కీడులో మేలు అని అంటారు. మా వూళ్లో పోతన్నగారని ఒక పెద్దమనిషి వుండేవాడు తిండిలో మొండి శిఖండి. ముంజలు తింటే డజనుల లెక్కను తినేవాడు. మామిడిపళ్లు తింటే, అదే ప్రత్యేక భోజనంగా తినేవాడు. తనకు మందుగాని, గుళికగాని, వైద్యుడుగాని, మాత్రగాని యీ జన్మలో అవసరంలేదని వాదించేవాడు అటువంటి ప్రతిజ్ఞచేసి, మితిలేని తిండితినేటటువంటి పోతన్నగారికి ఒకసారి చాలా జబ్బుచేసింది. ఆరు మాసాలు అజీర్ణ బాధవల్ల అవస్థపడ్డాడు ఆఖరుకు మావూళ్లో అప్పలాచార్యులుగారు కఠిన పథ్యం నిర్ణయించి, ఆకుకూరలతోనే ఔషధం యిచ్చాడు ఈవిధంగా ఆరు మాసాలు ఆయన యింట్లోనే పోతన్నగారిని వుంచి చేతనైన మందులిచ్చాడు ఆరు నెలలు చికిత్స చేసాడు ఈ ఆరు నెలల వైద్యంతో ఆయన ఆయుర్వేదం చాలావరకు నేర్చుకన్నాడు. అప్పటినుంచీ, ఆయనకు ఆహార నియమములు ఎక్కువైనాయి ఎటువంటి అజీర్ణ వ్యాధికైనా, ఆయన స్వయంగా మందులిచ్చి కుదిర్చే మంచి ఘ వైద్యుడనే ఘనత సంపాదించాడు ఆరు మాసాల దీర్ఘరోగంతో, ఆయన ఆఖరుకు ఆయుర్వేద వైద్యుడైనాడు ఆయనకు వ్యాధిరావడంతో, ఆయనకు కీడు మూడినదన్నాడు కాని, ఆ కీడులోనే ఆయనకు మేలు కలిగింది విమానదాడి భయంవల్ల పట్టణాలు అనేకం విధిగా ఖాళీచేయవలసివచ్చింది కాని, ఇందుమూలంగానైనా, విద్యాధికులైనవాళ్లున్నూ, ధనాధికులైనవాళ్లున్నూ గ్రామాలకు వెళ్లుతున్నారు గనుక, అది ఒక మంచి విషయమే అని చెప్పవచ్చు. గ్రామస్థుల కష్టసుఖములను

గ్రహించి వారి సాధక బాధకములను స్వయంగా తెలుసుకొని, వారి కష్టనిష్టురములను తొలగించుటకు యీ ధనవంతులూ, యీ విద్యావంతులూ ప్రయత్నం చెయ్యడానికి ఒక మంచి సందర్భావకాశం ఇప్పుడేర్పడింది. గ్రామాలను వీరు యీ సందర్భంలో బాగుచేసినా చేయకపోయినా, బస్తీల వారే అక్కడకువెళ్లి కొంతవరకైనా బాగుపడగలరు.

బస్తీలో ఉండేవాళ్లు “అయ్యబాబో! మేము ఆ పల్లెటూరి కాపురం చెయ్యలేము బాబూ!” అని అంటే అవి వట్టి బడాయిమాటలనే అభిప్రాయం కలుగుతూ ఉండేది. బస్తీలో సుఖపడుతున్నాననిన్ని, పల్లెటూరు వెళ్లితే చాలా కష్టపడవలసివస్తుందనిన్నీ అనుకోవడం సామాన్య లక్షణమైంది అందాకా ఎందుకు? పెళ్లి యీడువచ్చిన ఒక పల్లెటూరి పిల్లనే అడిగిచూడండి. “ఏ సంబంధం నీకు బాగున్నదే అమ్మాయి! చదువుకొని ఉద్యోగంచేస్తున్న బస్తీ మొగుడు కావలెనా? కుక్కనున్న జొన్నపాడులో పాతిక యకరముల భూమందైన బావను పెళ్లిచేసుకుంటావా?” అని పల్లెటూరి పిల్లను అడిగితే, బస్తీ సంబంధమే చేసుకుంటానని జవాబు చెప్పుతుంది. మనవాళ్ల బస్తీ మోజు అట్లా ఉంది.

ఇంకో విషయం చూడండి. మొన్న చెన్నపట్నంలో అనవసరమైన జనాన్ని ఖాళీచేసి పొండి అని ప్రభుత్వాధికారులు చెవినిల్లు కట్టుకొని, చిలుకకు చెప్పినట్లుగాచెప్పి, పత్రికలలో కూడా ప్రకటనలు చేశారా లేదా? పట్టణంలో వున్నవాళ్లు అనేక యిళ్లవాళ్లు పొరుగూళ్లకు వెళ్లిపోయినారు. పట్నంలోనే పరశువాకం అనే ఒక పేట ఉంది. అది సముద్రానికి చాలా దూరంగా వుందికదా, పరశువాకమునకు భయం లేదనిన్నీ, “ఇక్కడి ఇల్లూ వాకిలి వదలిపెట్టి మన మెక్కడికీ వెళ్లనక్కరలే” దని రామలింగయ్యగారి భార్య మంగమ్మగారు యీ రోజువరకూ యింకా వాదిస్తూనే వుంది. రామలింగయ్యగారు అయిదేళ్లనుంచీ పించను పుచ్చుకుంటూ, కొడుకులు చదువుకుంటున్నారు గనుకనూ, పట్నంలోనే స్వగృహం వున్నది గనుకనూ, చెన్నపట్నంలోనే కాపురంగా వుంటున్నాడు. కాని వాళ్లకు గోదావరి జిల్లాలో మంచి భూములున్నాయి. అది పల్లెటూరు. అక్కడ ఒక మండువా యిల్లుకూడా వుంది. కొత్తపేటకు రామలింగయ్యగారు వెళ్లి అక్కడి భూములు చూచుకొని ధాన్యం వసూలుచేసికొని, అక్కడనే అమ్మించి పైకం తెచ్చుకుంటూ వుంటాడు. ఆయన ఆ ఊరు అప్పుడప్పుడు వెళ్లివస్తూ వుంటాడు కాని, ఆయన కొడుకులు అసలే వెళ్లరు. ఆయనకోడళ్లు పట్నంనుంచి కదలనే కదలరు. మొన్న నీ మధ్య మద్రాసునుంచి కాపురం ఎత్తివేసి కొత్తపేటకు పోదామని రామలింగయ్యగారు సిద్ధమైనాడు. కోడళ్లిద్దరూ కోపించి కూర్చున్నారు “చెన్నపట్నానికి విమానాలూ రావు, గిమానాలూ రావు. అంతగా వచ్చినా మన మారుమూల యింటికి రానేరావు మన పరశువాకంలో మన యింటికి కూడా విమానాలు వస్తే, పోనీ! ఆ బాంబు లేవిటో, ఎట్లా వేస్తారో చూడనైనా చూస్తాం. విమానాలమీద పట్నానికి వచ్చినవాడు, కొత్తపేటకు మాత్రం రాడనే గ్యారంటీ ఏమిటి? కొత్తపేటలో రామలింగేశ్వరస్వామి ఉన్నాడని చెప్పి, రాకుండా పోతాడా? ఆమాటకువస్తే పరశువాకంలో రామలింగయ్యగారు వున్నారని చెప్పి, వృథాగా మన యింటిమీద బాంబులు వెయ్యనే వెయ్యడు.” అని యీ ప్రకారం ఇద్దరు కోడళ్లూ వాదించడం సాగించారు. పాపం! కొత్తగా కాపురానికివచ్చిన ఆ పడుచుపిల్లలకు ఏమి తెలుస్తుంది? ఈ కాలపు యుద్ధమంటే ఏమిటో ఎన్నడైనా పత్రికలలోనైనా శ్రద్ధగా చదివి తెలుసుకున్నారా? అదీ లేదు. బాంబులు పైనుంచి పడతాయి అని చెప్పితే, అవి కొబ్బరిబొండములు పైనుంచి పడినట్లుగానే పడతాయనిన్నీ, దూరంగా నిల్చున్నయెడలగాని, ఇంట్లో తలుపులు మూసికొని హాయిగా ఎవరి గదులలో వాళ్లు పడుకున్నయెడలగాని ఏమీ భయంలేదని వాళ్ల ఊహ. రామలింగయ్యగారి భార్యా, కోడళ్లమాట ప్రకారంగా వాళ్లముద్దులు చెల్లించవలెనంటుంది. తన మట్టుకు తనకు ఏమీ భయంలేదని చెప్పింది. తన జాతకం ప్రకారంగా తనకు పసుపు కుంకంతో వెళ్లిపోయే అదృష్టమేగాని, వైధవ్యమనేది తన జాతకంలో లేదని వాదించేది. కనుక, ఏ వెధవ ఎన్ని బాంబులువేసినా, ముత్తయిదుగానే తన తనువు చాలించుకొని, చేసుకొన్న భర్తగారి చేతిమీదుగా కొడుకులూ, కోడళ్లూ బాగుండగానే హాయిగా భగవంతుడి దగ్గరకు వెళ్లిపోతానంటుంది. “కొడుకులను మాత్రం ఆంజనేయ దండకం చదువుకుంటూ ఉండండి నాయనా!” అని చెప్పింది. రామలింగయ్యగారు ఎప్పుడు బయటకు వెళ్లినా “లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబం” అంటూ లక్ష్మీనృసింహస్తోత్ర శ్లోకాలు చదువుకుంటూ, అపాయం రాకుండే ఉపాయం ఇంతకు మించినదింకొకటి లేదన్నాడు. కోడళ్లిద్దరికీ, సిద్ధాంతిగారు రెండు కవచాలు యిస్తానన్నారు. ఆ రక్షరేకులకన్నా కొత్తపేట ఫకీరుయిచ్చే తాయెత్తులు కట్టుకుంటే ఇంకా ఎక్కువ కాపుదలగా ఉంటుందని మంగమ్మగారు సలహా యిచ్చింది. చేతికి రిస్టువాచీలు పెట్టుకొని ఫ్యాషనుగా తిరిగే అమ్మాయిలు అసహ్యంగా తాయెత్తులూ రక్షరేకులూ కట్టుకొనుటకు ఒప్పుకుంటారా? రామలింగయ్యగారు అందుకని శివలింగ మాహాత్మ్యం చదివి వినిపించాడు. యముడు స్వయంగా ఎదుటకు వచ్చినా సరే, శివలింగానికి సాగిలబడి కావిలించుకుంటే, మార్కండేయులవారిని శివుడు రక్షించాడు. కనుక, మార్కండేయులంత ఆయుస్సుతో చిరంజీవులై ఉండడానికి అది ఒక్కటే దివ్యమైన శరణ్యం—ఈ విమానదాడి శరణ్యాలు దానికంటే ఎక్కువైనవి కావు అని చెప్పి ఇంట్లో నాలుగైదు శివలింగములు ప్రతిష్ఠచేయిస్తానన్నాడు. కోడళ్లకు యీ మార్కండేయ పురాణం చెప్పితే చెవికెక్కుతుందా? “మార్కండేయ పురాణమూ లేదు—మామిడికాయ పురాణమూ లేదు. శుభ్రంగా రెండు ఉక్కు టోపీలు, ఏ ఆర్.పి. వాళ్ల ఉక్కు టోపీలవంటివి, తెప్పించుకొని తలమీద ధరిస్తే ఏ ప్రమాదమూ లేదని ఇద్దరు కోడళ్లూ నిర్ణయించుకొన్నారు. ఉక్కు కవచాలతోబాటు, విషవాయు కవచాలు కూడా తెప్పించుకొన్నారు. ఉక్కుతో చేసిన దొర టోపీ నెత్తిమీద పెట్టుకొని, ముఖానికి ఎలుగుబంటి ముట్టెలాగున విషవాయు కవచం తగిలించి రామలింగయ్యగారి కోడళ్లు మొన్న వీధిలోకి వచ్చారు. ఇద్దరూ నరభల్లూకావతారముల లాగున్నారు. “ఎందుకీ భేతాళుని వేషాలు! పరిశవాకంలో యిల్లు తాళంవేసి కొత్తపేట పోదామ”ని రామలింగయ్యగారు యీ వెర్రివికారాలన్ని చూచి వెయ్యి విధాలుగా మళ్లీ కోడళ్లకు బోధిస్తూనేఉన్నాడు. వాళ్లకళ్లకు ముందున్న ప్రమాదం ఏమీ కన్పించడం లేదు. బంగారు కళ్ల జోళ్లు పెట్టుకొని, రిస్టువాచీ చూచుకుంటూ, కాఫీ తయారైతే, కాఫీతో కడుపునింపడానికి, కాఫీకప్పులలాగున హాజరవుతూ, క్రిందపడితే పగిలిపోయే నాజూకు గాజుకుప్పెలు లాగున తయారైనారు. పరశువాకం ఎన్నటికీ పరశురామ ప్రీతికాదనిన్నీ, దీనికంటే కొత్తపేట భద్రమనేది ఉత్తమాకు అనిన్నీ, వాళ్లు ఎదిరించి వాదించడం ఎందుచేతనో బాగా పరిశీలిస్తే బోధపడింది.

అసలు కారణం ఏమిటంటే, మద్రాసులో ఉంటే వండని అన్నం, వడకని బట్ట అన్నట్లుగా సుఖంగా జరుగుతోంది. నూతిలో నీళ్లు తోడనక్కరలేదు. కుళాయి తిప్పితే నీళ్లు. టిక్కుమని నొక్కితే ఎలెక్ట్రిక్కు దీపం. ఆ దీపాలకాంతిలో

# జనరల్ వేవల్‌గారి బర్మా విజయము.



ప్రస్తుతం ఇండియాదేశపు ప్రధమ సేనాధిపతియైన జనరల్ వేవల్‌గారు బర్మాలోని చిట్టాంగ్ రణరంగములోని చీనా సైనికులని పరిశీలించిరి. ఈ పటమునందు జనరల్ వేవల్, బర్మా సేనాధిపతి జనరల్ అలెగ్జాండర్ చీనా సైన్యాధిపతి, అతని ముఖ్యోద్యోగస్తుడు మొదలైనవారు కనిపించెదరు.

---

ఈ స్త్రీలు ఆ స్త్రీ చీరెలు కట్టుకొని, ఇంద్రసభలోని రంభలాగున, లోలాకులు ఊపుతూ, తమలపాకులు నవులుతూ, "కాంచనమాల బాగుందా? కన్నాంబ బాగుందా?" అని సినిమా కబుర్లు చెప్పుతుంటూ, రేడియో పెట్టెముందు కూర్చుండి, తడవకొక విచిత్రపు ఢిల్లీ సంగీతం వినేవాళ్లు పల్లెలకు రమ్మంటే వస్తారా? మద్రాసులో ఉన్న మజా, కొత్తపేటలో ఉంటుందా? "ఎత్తిచ్చి కరగబోసిన యిత్తడి బంగారమౌనె? యిలలో సుమతి!" ఇత్తడి బంగారము కాదు. కొత్తపేట బస్తీ కాదు. కాని, అక్కరకువచ్చేది ఇత్తడి—బిందెలైనా చెంబులైనా ఇత్తడివే అక్కరకువస్తాయి. నిర్భయంగా వాడుకోదగింది ఇత్తడి. శృంగారానికి పనికివచ్చేది బంగారం. భద్రంగా బంగారంలాగున వాడుకోవలసిన బస్తీ శరీరాలు, పల్లెలకుపోతే, దొంగనోట్లు లాగున చెలామణీ కావు. ఇంటి ఖానుంపు ముందు తెచ్చి లాగిస్తే, పైకి పసందుగా పౌడర్లు పూసికొని తిరగడంవల్ల తిన్న అన్నం అరగడం కూడా అసంభవం. బస్తీలో నుస్సీ చేసినా, పల్లెలకు పోయి జబర్దస్తీగా బ్రతుకాలనే కోరిక కలగలేదు.

ఎట్లాగైతేనేమి? కీడువచ్చినా మేలుకోసమే అన్నట్లు యింది. ఆఖరుకు మద్రాసులో వీళ్ల వీధిలో ఉన్న వాళ్లంతరూ యిళ్లు ఖాళీచెయ్యడంవల్ల, ఒంటరిగా యింటిలో ఉండలేక, భయంకలిగి, మంగమ్మగారు మళ్లీ మాట్లాడకుండా కొత్త కోడళ్లని సిద్ధరిసి తీసుకొని కొత్తపేట చేరింది. "దిక్కుమొక్కులేని వీధిలో, పిలిస్తే పలికే అడకోడుకూడా లేని పాడు పట్టణవాకంలో, గుండెరాయిచేసికొని, యీ పడుచు కోడళ్లతో ఉండలేను బాబూ!" అని ఆవిడ సణుగుతూ సకుటుంబంగా భర్తపతి సమేతంగా, వెనుకకు తిరిగిచూడకుండా వెళ్లిపోయింది. కోడళ్లకు కొత్తపేటలో క్రమేణా షోకులుతగ్గి పనిపాటు లలవాటుపడుతున్నాయి. "షోకుకోసం కళ్లజోళ్లు పెట్టుకొని తిరుగుతూవుంటే, విమానదాడివస్తే విరిగిన అద్దాలు చెదిరి పడతాయి కనుక అద్దాలు తీసేసి అట్టలు పెట్టమన్నారు గనుక, అట్టి గట్టి అట్ట కళ్లజోళ్లు పెట్టుకోండి" అని కరణంగారు ఆ పిల్లలను చూచి హాస్యాలు చేశాడు. అప్పటినుంచి అనవసరమైన ఆ కళ్లజోళ్లు, అమ్మినా సొమ్మురాని ఆభరణాలు, కరణంగారి మూలంగా, కన్పడకుండా పెట్టెలో దాచారు. జోళ్లు కనపడకుండ దాచినా, కళ్లు బాగానే కడపడుతున్నాయి. అయినా, షోకుకోసం కళ్లజోళ్లేమిటి? బస్తీనుంచివచ్చిన తర్వాత ఇప్పుడు బాగా కళ్లు తెరుస్తున్నారు. బస్తీకి స్వస్తి చెప్పినతర్వాత వంట్లో నుస్సీ కూడా లేదు. కనుక, కోస్తా బస్తీలన్నీ త్వరగా ఖాళీచేసి, ఈ సంగ్రామ సమయంలో గ్రామాలకు చేరడమే ఉభయత్రా ఉత్తమం—స్థానంలేని క్షేమం; ప్రమాదంలేని ప్రశాంతం, అందులోవుంది.

# ఇది శత్రువుపనే.

ఈ దేశంలో పంచమదళం ప్రచారం ఒక విధంగా ప్రస్ఫుటమగుచున్నది శత్రువున కనుకూలమగు ప్రచారం చేయువారిని పంచమదళం అంటారు. సైన్యంలో చతురంగబలాలుంటాయి. వాటికి సహాయకారిగానుండు రహస్య కుట్రలు చేయు సివిలు ప్రజలను పంచమదళం అనడం యూరోపుదేశాలలో వాడుకయింది. కనుక యీ దేశంలోకూడ ఆపదం వాడుకలోకి వచ్చింది. బ్రిటిషు సైనికులయొక్కయు భారతీయ సిపాయీలయొక్కయు స్వభావములను నిందించి, వారిని గూర్చి సందేహంగాతరుచు పలుకుచుండుట శత్రువు కోరిన ఫలితమును చేకూర్చును. అదేదన, సివిలు ప్రజలకును వారిని రక్షించు సైనికులకును విశ్వాసం చెడగొట్టుట.

ప్రతీదేశంలోను, ప్రతీ యుద్ధంలోను, వేల కొలది సైనికులు మకాంచేసి సిద్ధంగా తయారుగా నుంచబడినపుడు కొద్దిమంది అక్కడక్కడ గడి తప్పి నియమవిరుద్ధంగా ప్రవర్తించడం జరుగుచుండును. తెలివిగల ప్రతి భారతీయుడును, ప్రతి బ్రిటిషువాడును యీవిషయ మెరుంగును. ఇదివర కిట్లా జరిగింది, కాని యిపుడు బయల్పడుచున్నంత నిందలు, యింత పట్టుదలగ తరుచు సైనికులను తూలనాడడం, సామ్రాజ్యసేన మొత్తాన్ని చులకనచేసి నిందలుమోపడం యిదివరకెన్నడు జరిగినట్లు జ్ఞాపకంలేదు. అభిప్రాయంతో గాని, అజ్ఞానంతోగాని, దురుద్దేశంతోగాని యింత యెక్కువగ బ్రిటిషు సేనను సామ్రాజ్య సేనను నిందించుట ఎరుగం. రెండేండ్లనుండి వేలకొలది సైన్యాలు వేలకొలది కేంద్రాలలో నుంచబడినా, యిట్టి అత్యాచారాలు వ్రేళ్లపై లెక్కించకల్గినంత మాత్రమే జరిగినవి. సామాన్యంగా ఒక్క జిల్లాలో ఒక్కచోట సివిలు ప్రజలలో జరుగు నేరాలెన్నో అన్ని జరిగియుండవు, సంఖ్యనుబట్టి తైఫారేసిచూస్తే. కనుక యీ నిందలు వాడుకైపోవుటకు పంచమదళ కుట్రలే కారణం కావచ్చును.

అందుచే, ఇండియా ముఖ్యనగరాలలోను, ప్రత్యేకంగా సైన్యాలు మకాంచేసియుండు నగరాలందున్నవారు తెలుకోవలసిందేమంటే, చరిత్రలో నెన్నడు ప్రపంచంలో ఏసైన్యంకూడ యిపుడు ఇండియాలోనున్న సైన్యం ఉన్నంత ఎక్కువ కట్టుదిట్టాలతో నీతివంతంగా శ్రద్ధగ నుండలేదు. సామ్రాజ్యసేనల గౌరవ ప్రతిష్టలు ఏమాత్రం తగ్గకుండావుండాలని సైన్యాధికారులు శ్రద్ధతో పని చేయుచున్నందున భారతీయులలో పెక్కుమందికి సేనలంటే గల భయం ఎందుచేతనా యని వారు అనుమానపడుచున్నారు. ఆత్మనిగ్రహమునందు ఔదార్యమునందు, శత్రువు నోడించి ఇండియాను రక్షించవలసిన తమ బాధ్యతను పట్టుదలతో నిర్వహించుటయందును, మన యిప్పటి సేన యితర దేశాలలో ఏసేనకును తీసిపోదనిచెప్పుట సత్యదూరంకాదు. అది మొత్తంపై చెప్పినమాట కనుక తేలికగ నెంచరాదు. సమర్థులును, ధైర్యస్థులును చాల నీతినియమంగల సైనిక సమూహం అంతా నీతిలేనివారనే నిందలోకన్న పైవాక్యంలో సత్యం ఎక్కువున్నది. ఒక ట్రాం కారులో యిరువురు హిస్టీరియా గల స్త్రీలు సిపాయిలనుచూచి భయపడ్డారని, ఒక ఇంగ్లీషు సిపాయి త్రోవడిగినపుడో దీపాలార్పుకోండని చెపితే కోపగించుకొనో, సిపాయిలంతా చెడ్డవారనుకోరాదు."

---

## మదరాసు హవల్దారుకి బిరుదు

మదరాసు సేపర్సు అండు మైనర్సు దళము నందున్న ఆరోగ్యస్వామి అను 13080 నెంబరు హవల్దారునకు, ఆఫ్రికాప్రాంతములందు యుద్ధంలో అసమాన ప్రతిభ ధైర్యం చూపినందుకు "ఐ.డి.ఎస్.ఎం." బిరుదు ఒసంగబడినదని ఇండియాప్రభుత్వంవారు గత శనివారం ప్రకటించిరి.

## జపానువారి దొంగ నోట్లు

జపాను సైనికు లాక్రమించిన దేశాలలో తప్పుడు దొంగనోట్లను కుప్పించి ప్రజలను మోసగించుచున్నారని అమెరికా ప్రభుత్వం ట్రెజరీ ఉద్యోగులు తెల్పుచున్నారు. జపాను సూచించిన "సమానాభివృద్ధి" ఆశలకు లొంగినవారందరికి యీ నోట్లవలన దారిద్ర్యం ప్రాప్తించి, జపాను సైనికాధికారులకు మంచి లాభాలు చేకూరును.

“తూర్పు ఏషియా సమానాభివృద్ధి ప్రాంతం” అనుపేరన నిరుపయోగమగు కాగితపు నోట్లను అచ్చువేసియిచ్చి ఆ ప్రాంతాలలో విలువగల ఆస్తులను తీసుకొనుచున్నారు. చీనాలో జపాను పాలనయందున్న ప్రాంతములందు ఆరు రకాల జపాను నాణెములు కురిపించబడినవి. జపాను ఆక్రమించిన నగరాలయందు మిలిటరీ యన్నులు (జపాను నాణెము) సివిలియను యన్నులు కోట్ల కొలది గలవు. అవన్ని జపాను బ్యాంకులు తయారు చేసినవే. కరెన్సీనోట్ల విలువకు తగిన బంగారం బ్యాంకులలో నిలువయుండాలి. అట్లా జపాను బ్యాంకులలో యీ నోట్లకు లేదు. ఈ నోట్లు జపాను దేశంలో వాడుక చేయరు. లోబడిన బానిసరాజ్యాలలోనే చెలామణి చేస్తున్నారు.

నిప్పను (అంటే జపాను) ఆర్థిక వేత్తలు గారిడీవారివలె మారకం రేట్లను గూడ తారుమారు చేసి, ఆక్రమిత దేశాలలో ప్రజలను నష్టపెట్టి, జపాను సామ్రాజ్యాధికారులకు లాభం చేయుచున్నారు.

# అండమాను దీవులు ఖాళీచేయుట.

## పనముండుగురు ఉద్యోగులు వెనుకమిగిలిరి.

జపానువారు అండమానుదీవులు (బంగాళాఖాతంలోవి) ఆక్రమించుటకు కొంతకాలం క్రిందటనే ఆ దీవుల రక్షణ దుస్సాధ్యమని అధికారులకు తెలిసియుండెను, ఈ దీవులలో నేరస్తులగు ఖైదీలు స్థిరనివాసముంచబడిరి. వారందరిని పూర్తిగ ఖాళీచేయించుటకు తగిన ఏర్పాటులు చేయుటకు అవకాశములేకుండెను, కావున చీఫ్ కమీషనరు సి. ఎఫ్. వాటరుఫాలు ఐ.సి.ఎస్., గారు తమకు తోచినరీతి, నౌకల సదుపాయం చూసుకొని ఖాళీ చేయించు ఏర్పాటులు చేయ ఉత్తరువు చేయబడిరి. దీవులలో తప్పని సరిగా ఉండవలసిన ఖైదీలకు సివిలు ప్రజలకు అవసరమగునంత కొద్దిపాటి ఉద్యోగుల శిబ్బందినేయుంచి తక్కినవారందరు పోవాలని నిశ్చయింపబడెను. ప్రభుత్వోద్యోగుల కుటుంబాలను కొంతకాలంనుండి ఇండియాకు చీఫ్ కమీషనరుగారు పంపుచుండిరి. శత్రుదాడి వచ్చేసరికి వారంతా ఇండియాలో భద్రంగా యున్నారు. బయటనుండివచ్చిన మరికొందరి స్త్రీలను బిడ్డలను గూడ పంపివేసిరి. ఈ ఉత్తరువుల ప్రకారం చీఫ్ కమిషనరుగారు అప్రాముఖ్యమయిన పరిపాలనాశాఖల ఉద్యోగులు కొందరిని, కొందరు ఖైదీలను గూడ వారు ఇండియాకు పంపగల్గిరి. వారికి ఇండియా ప్రభుత్వం వారు సర్వాధికారం ఒసంగిరి. అయినను అతడు మరో ఏడుగురు ఉద్యోగులతోగూడ చిట్టచివరవరకు అచటనేఉండి తన బాధ్యతను నిర్వహించుచుండిరి. శత్రుదాడి వచ్చుసరికి అతని వద్ద ఐదుగురు బ్రిటిషు ఉద్యోగులు, ఇరువురు భారతీయోద్యోగులు, కొందరు దిగువ గుమాస్తాలుండిరి. శత్రువు లాదీవు లాక్రమించిన పిదప ఆ దీవులనుండి వార్తలే రాలేదు. వాటరుఫాలుగారును, వారితోపాటు అచట ఉండిపోయిన వారును భద్రంగా ఉన్నారని ఇండియా ప్రభుత్వం వారు ఆశించుచున్నారు. విలువగల సదుద్యోగుల సేవాభాగ్యం తాత్కాలికంగా పోయినందుకు విచారించుచు తమ స్థానాలు వీడకుండా నుండినవారి సేవాతత్పరతను ప్రభుత్వంవారు కృతజ్ఞతతో గుర్తించుచున్నారు.



# రష్యాకు సప్లయిలు.

## పెర్షియా మార్గమున తెరిపిలేకుండా పోతున్నాయి.

"రష్యా సైనికబలం వృద్ధిచేయుటకు ఇంగ్లాండు-అమెరికాలనుండి వచ్చిన సరకు పెర్షియా మీదుగ అనేకవేల టన్నులు పోవుచుండుట నేచూచితిని" అని లండనులోని డెయిలీ టెలిగ్రాఫ్ పత్రిక టెహరాను (పెర్షియా) విలేఖరి వ్రాసెను.

"పెర్షియను గల్ఫు శిఖరంవద్దనున్న బాందరు షాపూరునందు నెనో రోజున వుంటిని. ఆరేవులో 1,000 టన్నుల సరకానాడు దిగింది. క్రొత్తగ వేయబడిన వందలకొలది మైళ్ల నిడువుగల రోడ్లపై నేను సామానుగల మోటారు లారీలవెంట పెర్షియా ఉత్తర కొనవరకు పోతిని. అచట రష్యను సైనికులు యీ సరకు తీసుకొందురు. అక్కడనుండి యుద్ధసామగ్రి యింకా ఉత్తరానికి రోడుపైని, రైళ్లపైని సముద్ర మార్గములందు పోవుచుండును.

"నిరుడు ఆస్ట్రేలియా ప్రభుత్వంవారు పంపిన ఒక రైలు ఇంజను పలకపై నేను నిలచియుంటిని. అది దక్షిణ పెర్షియాలో ఎడారి కడ్డంగా వేయబడిన రైలు మార్గంమీద ఎన్నో గుడ్సు బండ్లను ఉత్తరానికి తీసుకపోవుచుండెను. అక్కడున్న నదీమార్గములందు పడవలు యీ సామాను బరువులతో నీటిమట్టంవరకు క్రుంగి నెమ్మదిగ పోవుచున్నవి.

"అన్నిమార్గములనుండి రష్యాకు యుద్ధసామగ్రి అతివడిగ పంపబడుచున్నది. పెర్షియా రేవులలో సరకు అతివడిగా దిగి వెన్వెంటనే నేల మార్గముల ఉత్తరంగా పంపబడుచున్నది. ఈ చురుకు యీ వడి బ్రిటిషువారి చాకచక్యమునకు మంచి నిదర్శనములు. అనేక రకాల సరకు గాంచి నేను ఆశ్చర్యపోతిని,

"యుద్ధసామగ్రిలో, ఆయుధాలేగాక, తోలు సామానులు, గోధుమలు, జనుము, లక్క, వున్ని, సీసం, క్వైనైను, రబ్బరు, పాదరసం, రేకులు, యిత్తడి, రాగి, ఎల్యుమినియం, చక్కెర గూడ రష్యాకు పంపబడుచున్నవి.

"ఇంత త్వరలో పెర్షియామార్గం యేర్పాటు చేయబడుటే ఆశ్చర్యం. రోడ్లు చాల బాగా మరమ్మత్తు చేయబడినవి. బాగ్దాదునుండి టెహరానుకి 500 మైళ్లు రెండు రోజులలో రాగలిగితిని" అని ఆ విలేఖరి వ్రాసెను,

# మదరాసు యుద్ధనిధి 2 కోట్లు మించుట.

మదరాసు గవర్నరుయుద్ధనిధి వసూళ్లు రెండు కోట్లు మించిననాడు గవర్నరు సర్ ఆర్థరు హోపుగారు రాష్ట్రప్రజల దేశాభిమానమును ధర్మకార్యానురక్తిని కొనియాడుచు యిట్లు ప్రకటించిరి :—

ఏడాదిక్రిందట ఏప్రిలు 6 వ తేదీనాడు,యుద్ధనిధి ప్రారంభించిన తొమ్మిది నెలలలోగానే ఒకకోటి రూపాయలకు మించిపోయింది. వీలయినంత ఎక్కువగ చందాలిమ్మని నేను మిమ్ము కోరియుంటిని. అందుకు మీరు చాల ఆదరముచూపి చందాలిచ్చినందుకు, నేడు యీ రాష్ట్రము రెండు కోట్లను మించిన చందాయిచ్చినందుకు సగర్వంగా అభినందించుకోవచ్చును.

"గొప్పవారు పేదవారుకూడ తమ యధాశక్తి నొసంగిరి. అట్టివారికి నా హృదయపూర్వకమగు కృతజ్ఞత యెంతచెప్పినా చాలదు.

"మీ చందాలవలన మీ దేశభక్తిని, ధర్మకార్యానురక్తిని ప్రపంచానికి చాటిరి. విజయం చేకూరువరకు మనల నెదుర్కొను కష్టాలలో మీరు ఐకమత్యంతో నిలచియుందురని నమ్ముచున్నాను."

MADRAS. PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.